ఓమ్

శ్రీ




  

కాత్యాయని.  యాజ్ఞవల్క్యమహర్షి.  మైత్రేయి.

శ్రీజగద్గురు యోగీశ్వర యాజ్ఞవల్క్యాచార్య సద్గురుభ్యోనమః.

# యాజ్ఞవల్క్య చరిత్ర.

ఇయ్యది

వంగిపురపు వీరభద్రాచలపతిశర్మలచే

విరచింపఁబడి

గుంటూరుపురవాసియు, శుక్ల యజుః కాణ్వశాఖీయులును, లోలేటివంశపయఃపారావార రాకా సుధాకరులును, వెంకయాఖ్య ప్రపౌత్ర, అప్పయాహ్వయపౌత్ర, పురుషోత్త మోదయ విజయలక్ష్మాంబాపుత్రకులైన

అప్పారావు పంతులుగారి

ద్రవ్యసహాయమున

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు

కే. వి. కృష్ణారావుచే

ముద్రింపఁబడియె,

1914.

# ఉపోద్ఘాతము.

శ్లో॥ వేదాన్తవేద్యం సకలాఽగమజ్ఞం దయాసుధాసన్ధుమనన్త
రూపమ్ । శ్రీయాజ్ఞవల్క్యం పరిపూర్ణచంద్రం శ్రీమద్గు
రుం నిత్యమహం నమామి॥

"శ్రుతిస్మృతిపురాణేషు యాజ్ఞవల్క్యస్య వైభవమ్" అను ప్రమాణ వచనప్రకారము శ్రీమద్యాజ్ఞవల్క్యమహర్షిసత్తముని ప్రభావమువర్ణింప నశక్యమై జనకరాజీయ, కణ్వకౌస్తుభ, జ్ఞానరత్నాకర, యోగసారసంగ్రహ, యాజ్ఞవల్క్యోదయ, తత్త్వమనోరంజన, యాజ్ఞవల్క్యదర్పణ, బృహదారణ్యోపనిషదాద్యనేకోద్గ్రంథంబులం గొనియాడుచుండం గాలానుసరణిం గొందఱు వానిం బరికింప నేరకుంటచే॥ "నానాంటికి తీసికట్టు నాగంభొట్ల"నునట్లింతకంతను స్వశాఖాస్థితియే యెఱుంగకుండునంతటి పాపమునకుం బాల్పడవలసె. ప్రకృతకాలమున నింతంతేసివారలామ్నాయంబుల సొట్టుశోధించి యేకొంచెపుముక్కనో యూంతంగొని మూలనున్నవి ముంగిళ్ళకుం దెచ్చి సంఘసముద్ధరణకై పట్టిపల్లార్చుచుంటయు, యజుర్వేదము (౧౦౧) విభాగములలో నగ్రగణ్యంబగు శుక్లయజుస్సునం గల పదునైదుశాఖలలో నాదిశాఖయగు కాణ్వ (ప్రథమ) శాఖాధ్యయనులు విప్రశ్రేష్ఠులై పూర్వోదాహృత శ్రుతిస్మృతిపురాణేతిహాసము లాధారము లతీతమైయుండ భావివృద్ధికి వెనుకంజవేయుచుంటయుం, బరికింపం గడుశోచనీయము. ఇట్లనుటచే నన్యమతదూషణాయనితలంతురేమో? అట్లుగాదు. వారియాందోళనముం గనియైనను కుశాగ్రబుద్ధులగువారు సంఘసంస్కరణం బొనర్చి పురోవృద్ధికిం దోడ్పడుదురనుట మా స్వభావసిద్ధము. కావున నో యాజ్ఞవల్క్యమహాశయులారా! బుద్బుదప్రాయంబగు కాయంబులచే సుస్థిరంబుగా, స్వకార్యధురంధరత్వమే సత్పురుషార్థమని తలంపక

"పరోపకారార్థ మిదంశరీర"మ్మను నార్యోక్తి నవలంబించి యావచ్ఛక్తిని సంఘోద్ధరణకై వినియోగించుటకర్తవ్యము. తొల్లి యోగనిద్రను జలేశయుండైన విరాట్స్వరూపుని నిశ్వాసంబు లఖిలామ్నాయభూరుహమ్మై యవతరింపనందు సత్యజ్ఞానానందరూపంబై సవ్యాహృతిక మోంకారము సర్వత్రసుఖావహంబై కోటిచంద్రప్రభాకాంతమ్మై పంచదశభేదంబుల శోభిల్లు నగ్రశాఖయగు య యాతయామమను శుక్లయజుశ్శాఖ నతిప్రీతిం బ్రప్రథమమున నావిశ్వమూర్తి గ్రహించుటచే, నాశాఖాసంప్రదాయకులు ప్రథమ (ఆది) శాఖీయులనియు, నానిగమమునే నిరపాయముగ రవిమండలమునందునిచి, పిమ్మట లోకంబునం బ్రచురింప, త్రిమూర్తిస్వరూపుడు యాజ్ఞవల్క్యమూర్తిగా నవతరించి, గురువాక్యోల్లంఘనకై తా నేర్చినవేదము నా వైశంపాయనున కిడి, మగిడి దినకరు నారాధించి గురువెఱుంగని యజుస్సు నొసంగుమనుటయు, నమ్మహాత్ముండు వాజిరూపంబున నుపదేశించుటచే నాశాఖీయులకు వాజసనేయులనియు, శ్రీమద్యాజ్ఞవల్క్యజగద్గురుండా కణ్వునకీ వేదమే ప్రథమమున బోధించుటం జేసి కాణ్వశాఖీయులనియు నామాంతరములం గలిగియున్నారు.

అన్యశాఖీయులు సైతము "వాజసనేయసమామనన్తి - అప్యశమీగర్భ స్యేతి వాజసనేయకమ్ - ససమ్భారాత్సమ్భరే దితి వాజసనేయకమ్ - సోమాభావే పూతీకా నితి వాజసనేయకమ్ - పూర్ణాహుతిపక్షే వాజసనేయకమ్" ఇత్యాద్యనేక వాజసనేయశ్రుతు లావశ్యకముగాం గొనుటయేకాక, "శ్లో॥ అధ్యయనం మూలశాఖాయాః కృత్వా సమ్యక్ సదా ద్విజాః॥ ఋగాదయో పృథోభాగే అధ్యేతవ్యా ఇతిశ్రుతిః॥" బ్రాహ్మణుండు ప్రథమమున శుద్ధసత్త్వప్రధానమగు శుక్లయజుర్వేదమునే యధ్యయనముం జేసి యాపై ఋగ్వేదాది స్వశాఖల నధ్యయనముం జేయవలయునని శ్రుతిచోదితంబై యున్నకతన వేదోత్తమత్వము శుక్లయజుస్సునకే చెల్లినది. అట్టి శాఖాప్రభావం బెఱుంగని కొందఱు దోషైకదృక్కులై శాఖాశ్రేష్ఠత్వమునుం గని సహింపనేరక నిరసనగాని కల్పితాక్షేపణలం గొన్ని వాగుచు దక్షిణాతాంబూలాశీర్వచనాదులయం దగ్రత్వముం జెందంజాలక నొకరిరువురుకలిసి కలదనినను, మద్దతునకొని మూర్ఖవాదమునం

గజ్జెకు కాలుద్రవ్వెదరు. "శ్లో॥ నిశ్వాసా ఇవ శ్రీ తేం ద్రం సామాన్యాః ప్రోద్ధరంతికిమ్॥" యనునట్లాదురుబుద్ధులు శాఖాప్రభావమును గలంపవనియు నట్టివారి పంకం బుడిగించి, ప్రీడాపాత్రులఁ గావించి, యజ్ఞానాంధకారమునుఁ బటాపంచలు నొనర్ప మ.రా.రా.శ్రీ పువ్వాడ వెంకటరావుపంతులు వారిచే సంపాదితంబైన వాజసనేయప్రభావ సుజ్ఞానభానూదయమే దృఢమనియు, నెంచి యాజోలి మేమంతగాఁ దలంపమైతిమి. కాత్యాయన, అగస్త్య, వ్యాస, శుక, శౌనస్సేప, కణ్వ, నారద, మార్కండేయ, శనైశ్చరులును, త్రిమూర్తులును, శ్రీరామకృష్ణులును, ఋషిసప్తకంబును, సూర్యచంద్రులును ఇత్యాదిమహనీయులెల్లఁ వాజసనేయులనియు, శుక్లయజుర్వేదాధ్యయన మొనర్చిరనియుఁ బ్రాజ్ఞులగువారల కెల్లరకుం దెల్లంబే. కావున శ్రీమద్యాజ్ఞవల్క్యనిప్రభావము ననుసరించి వివరించిన, గ్రంథవిస్తరమగుననియు, చర్వితచర్వణమగుననియు నెడి భీతి నినింతటితో విరమింపవలసె. వైశంపాయనాన్తేవాసులగు బోధాయనాపస్తంబ సత్యాషాఢ, హిరణ్యకేశప్రభృతులకుఁ దైత్తిరీయప్రదులును, నిత్యులును, యజ్ఞప్రధానులును, లోకాచార్యులును సర్వజ్ఞులును నగు శ్రీయాజ్ఞవల్క్య మహర్షిసత్తముని మహిమం బతీతమైయుండ సాధ్యాసాధ్యమునైనం దలంపక, బాల్యచాపల్యోత్సాహంబున, "లోకో భిన్నరుచిః" యనునట్లు గద్యములపైఁ గొందఱికిని, పద్యములపైఁ గొందఱికిని కీర్తనలపైఁ గొందఱికిని నభిమానముండుటంబట్టి, వారికథాకాలక్షేపనమున కనువగునటుల వ్రాయంబూనినారము కావున నిందుండు నెరసుల నిరసించి హంసక్షీరన్యాయంబున గుణగ్రహణపారీణులగుటకుం బ్రార్థితులు.

మఱియు నీగ్రంథమునకు ద్రవ్యమునిచ్చి మాపేరు జగంబునఁ బ్రచురింపఁజేసిన యౌదార్యశీలురగు శ్రీయుత, తోలేటి అప్పారావు పంతులువారికన్నియో కృతజ్ఞతాపూర్వకవందనంబులాచరించుచు, వారికిని నిత్య ధనధాన్యసంతానాభివృద్ధులొసంగుటకు శ్రీమత్పరమేశ్వరున కనేకవందనము లర్పించుచు నింతటితో విరమించుచున్నాము.

ఇట్లు,

వంగిపురపు వీరభద్రాచలపతికవులు.

ఓమ్.

పరమపావనకరంబగు పవిత్రమును గృతియిచ్చినం గొంతద్రవ్యమిత్తుమని కొందఱన్నను శ్రీవిరాట్స్వరూపుండగు నిమ్మహాఋషిచారిత్రమును నన్యులకిచ్చుట నీచమని తలంచి, ముక్తిపథము నెంచి, త్రిమూర్త్యాత్మకుండును, సునన్దాగర్భరత్న ముక్తామణియుఁ, గథానాయకుండును, నగు శ్రీయాజ్ఞవల్క్య జగద్గురువరేణ్యు పాదపద్మంబుల కీగ్రంథము నంకిత మొనర్చితిమి.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీమద్యాజ్ఞవల్క్యగురవేనమః.

# యాజ్ఞవల్క్య చరిత్ర.

శా॥ శ్రీనాథాదిసమస్తదేవమునిసంసేవ్యప్రభావంబు ప్ర
జ్ఞానిర్ద్వంద్వమనంతకీర్తియుతమజ్ఞానాబ్ధిఝంఝానిలం
బానందప్రదమక్షరంబమలమత్యైశ్వర్యదంబాద్యమ
ర్త్యానిత్యప్రణుతంబనాద్యము పరబ్రహ్మంబుమిమ్మోముతన్॥

శ్రీయాజ్ఞవల్క్యగురుస్తవము.

మ॥ శమితాంహంబగువిప్రవంశమున నాచంద్రార్కమౌ కీర్తి
ను। త్తమమానుల్ నుతియింపఁగాంచుటకునై తాబ్రహ్మ
రాత్యన్వయంబు మహిన్ వెల్గఁగఁబుట్టి భానునికడన్ బూ
ర్ణంబుగా విద్దెనే। ర్చి మహాభాగుఁడనంగనొప్పినఘనున్
జింతింతుమ్ప్రశాంతమున్ ॥

సరస్వతీప్రార్థన. రాగమాలిక - రూపకం.

అంబాకావగదే-జగదాంబా-సద్గుణకదంబ॥అం॥

అ॥ బమ్మమురిపెములకొమ్మ-భక్తులవరములగుమ్మ
రమ్మావాక్కమ్మా-మాయమ్మా బంగారుబొమ్మ॥అం॥

1 కలికలుషవినాశిని-కవిజనహృదయనివాసిని
కలహంసనజననీ-సర్వస్థితిప్రచారిణీ
నళినదళాయతనేత్రీ-నవమృదుకిసలయగాత్రీ
యలివేణీ-మితభాషిణి-యార్యామణి-కళ్యాణి॥ అం॥
2 అతులితమగునీప్రభావ-మభినుతింపనేరితరము- పతితపావనీ-
బ్రహ్మేంద్రప్రభృతులకేయలవిగాదు- క్షితిమనుష్యాధముం
డను- జిక్కులం బెట్టకుసీవే- గతియునినమ్మితి వేగమె - గావు
మానందభైరవీ॥ అం॥
3 కరుణార్ణవి,జగదీశ్వరి- కంబుకంఠిసాధ్వీమణి - పరమేశ్వరి,
తేజోమయి- బహువిధరూపసంచారిణి- వరదాయిని- సుర
భామిని- వైరివితతిసంహారిణి - శరణాగతనిరమ్మి త్రాతి - స
త్కృపమీరాతి- సావేరి॥ అం॥
4 సారెసారెకు వేడిన, స్వేఋచేయుటదినీకు - మేరగాదు నీవే
గతి- భారతీనిన్నె నమ్మితి- నీరజాధివాసినీ - నిఖిలలోకసంర
క్షిణి- ధారుణిలో వీరభద్రచలపతులను గిరవాణి॥ అం॥

వి. వీరభద్రశర్మ వంశావళి.

సీ॥ యాజ్ఞవల్క్యులలోన•హనుమకొండద్విజుండఁ, గాత్యాయ
నీసూత్ర•కలితకులుండ। వంగిపురాన్వయ•వార్ధిసంజాతుండ
ధాత్రిభారద్వాజ•గోత్రజుండ। పాపరాజార్యప్ర•పౌత్రుండ
గుణధాముఁ, జౌసుబ్బయకుఁ•బౌత్రుఁడైనవాఁడ। ఘనుఁ
డు గోపాలకృ•ష్ణునకుసాధ్వీమణి, యలమేలుమంగకు•నా
త్మజుండ।

గీ॥ యోగ్యుఁడౌ రామచంద్రు సంసోదరుండ
బుధవిధేయుండ హనుమానుపూజకుండ
జ్ఞానియౌ నప్పదాసు శిష్యప్రవరుఁడ
వీరభద్రుఁడ నెడిపేరం వెలయువాఁడ॥

## 2 వి. చలపతిశర్మ వంశావళి.

సీ॥ ఇలయాజ్ఞవల్క్యవంశేయుండ, కాత్యాయనసూత్రజాత
ధరాసురుండ । రహిమాన్మకోఁడ భారద్వాజగోత్రజాండ
శాఖాసియోగాన్వయుండ । వంగిపురాన్వయ వారాశిసోముఁ
డౌ పాపరాజాఖ్యుని పౌత్రకుండ । నరసయలక్ష్మమ పగతి
నుంజాతుండ భ్రాతృత్రయుంబునఁ బరఁగువాఁడ ।
గీ॥ దినకరోపాసకుండ సజ్జనహితుండ
నప్పదాసునిశిష్యుండ నమలమతిని
బ్రకటసుకవీంద్ర పాదాబ్జ బంభరుండఁ
బేర్మి "చలపతిశర్మయఁ" బేరివాఁడ ॥

## ఇష్టదేవతాప్రార్థన.

మ॥ ధరణీజాతనుఁగాంచి ఘోరవనముఁ ధ్వంసంబుగావించి
భీ । కరతఁ రక్కసులఁ వధించి తుద లంకన్గాల్చి యా
పంక్తికం । ధరు గర్వంబడఁగించి మించిన మహాత్మా, కా
మరూపా! ధరఁ । దరమే నీమహిమంబెఱుంగ హనుమ
న్నా, కేసరీనందనా! ॥

వ॥ తొల్లి నైమిశారణ్యమందొకనాఁటి సూర్యోపరాగపుణ్యకాలంబున నఖిల
ఋషితల్లజులొకచో నభిఁజేరి యత్యంతహర్షణంబున జగద్గురువర్యుండ

గు శ్రీమద్యాజ్ఞవల్క్యమహర్షి ప్రభావం బెఱుంగఁగోరి తచ్ఛాఖాయు క్తుండగు మంజుభాషణుండను పౌరాణికుం గనుంగొని.

మంజరి.

శ్రీయాజ్ఞవల్క్యమౌనీంద్రునిచా - రిత్రంబునువిశదముగ
శ్రేయంబలరఁగవచియింపుముమా - చిత్తంబులురంజిలఁగ ॥

వ॥ అనిన నామునిగరిష్ఠులతో మంజుభాషణుం డిట్లనియె.

సురట——ఆది.

వినుఁడిమానులార! మునివరుచరితము! హతదురితము, రస భరితము, నిరతము॥ అనుపల్లవి॥ మునుశౌనకాదిమునులకుసూ తుం - డనువుగ నికథయంతయుఁ దెలిపెను॥ వి॥

వ॥ అది యెద్దియన.

—♦ క థా ప్రా రం భ ము ♦—

చ॥ గురుగుణవారిరాశి కవికోవిదవందితుఁ డార్యమాళి సచ్చ
రితుఁ డుదారభావుఁడు ప్రశాంతుఁడు సారసవిష్టరాన్వయా
భరణుఁడు లోకమాన్యశుభవ్రతశీలుఁడు బ్రహ్మరాతినాఁ
బరఁగెడు విప్రుఁడొక్కరుఁడుభాసిలుసర్వజగంబులెన్నఁగఁ॥

॥ అమ్మహాపురుషతిలకుండు సునందయను శాకిలలామంబును బరిణయంబందె నాసాధ్వీమణియును సుగుణాలవాలయై నాధునిమనంబుననుసరించి సుఖం బులఁ బొలఁగుచుండునంత.

మంజరి.

1 సంతానం బాయింటికి నెంతయు జరుగకున్కిఁబలువంతఁ
గాంతునియాజ్ఞ వ్రతంబునుబట్టినఁ గాంతకు శ్రీహరియంతఁ॥
2 ఎలనాఁగాయిఁక సంతుగల్గునీ వెడదవమానుమీచింత
నలువురగనాతఁడువంశముఖ్యుఁడయి పొలువుఁగాంచఁదగుకాంత॥

వ॥ అని శ్రీమన్నారాయణుండు వరంబొసఁగినంత నా సునందనీకాంతాలలామ గర్భవతియై గర్భంబు ప్రబలుచున్నంత.

చ॥ చెలియకుఁగోర్కెలెచ్చె వళి చెందె ఘనత్వమునొందె మాంద్యమే। పలుకులుపల్కఁదోఁచె శ్రమభారమునై యుదరంబుమించెయు। గ్మలియటు పంచవర్షములు గర్భముఁదాల్చినఁగాని సంతుతాఁ। గలుగకయున్నఁ జింతఁగొని కాంత ప్రియు న్గనిపల్కె నిట్టులఁ॥

మంజరి.

ఏనాథాశిశువుజనింపకుంట కేమిహేతువొ దెలియఁ
యేనారీమణులకైనఁగలదే యిట్టివింతదలపోయఁ॥

వ॥ సురలకు ఘటికాసప్తకంబును, మర్త్యులకు నవమాసంబులు నుండనోపు. గాని యీరీతిఁ బంచాబ్దంబులుఁ జూలునిల్చియుండ నొరుల కచ్చెరువునాకు దుర్ఘటంబుగాదే, యనవుడు బ్రహ్మరాతి యచ్చెరువంది॥

కేదారగౌళ—రూపకం.

నలినాక్షిరో నే నేమని-పలుక నే ర్తునకటకటా

అ॥ప॥ తెలిసియుఁదెలియక మదమున- సలిపినట్టితొంటిపాప
ఫలముననుభవింపక త-ప్పదుమాఱిహరవిధులకైన॥ న॥
1 చెఱుగునెఱిఁగియును బ్రీతిని- గుడుములు తెగమెక్కుఁ బిదపఁ
గడుపునగుట్టెత్తుకున్నె-ఘనునికైనసీధాత్రిని
అలధాత నుదుటలిఖించిన-టులెజరుగుఁగాక కష్ట
ములవగవనవి తొలంగునె-కలదే! యిావింతకాంత॥ న॥

వ॥ అని గర్భంబుననున్న యర్భకు నుద్దేశించి.

మంజరి.

బాలక నీమాతృగర్భమందునఁ • బంచాబ్దములుమెలంగఁగ
మూలమదేమొవచియింపుమునీ • పోఁడిమిగనిమెచ్చంగఁగ॥

వ॥ ఇట్లనుడు సునందనీగర్భస్థుండగు నర్భకుఁ డిట్లనియె. ఓజనకా!

ఉ॥ దారసుతాదులెవ్వరో యిఁ • తండెవఁడో యనురాగమెట్టిదో
నేరక మోహవార్ధిమునిఁ • గి యశాశ్వతమైన మాయసం
సారమునందుఁజిక్కి యది • సాకుట కెన్నో వచింపరాని దు
ష్కారములాచరించు నర • జన్మమదేటికి నామ కార్థమే॥

వ॥ మఱియు, జీవుండు నరకకూపమయంబైన మాతృగర్భంబునందుఁ బ్రవేశించి దినదిన ప్రవర్ధమానశరీరుండై యష్టమమాసంబునఁ దొల్లి దానసుభవించిన బాములఁ దలంచుకొని సద్యోజన్మంబున నగు కామాద్యరిషడ్వర్గంబుల విసర్జించి పరతత్వధ్యానపారాయణుఁడైనై ముక్తింబొందెదనని తలంచి జన నంబైనవెంట నే విష్ణుమాయలం జిక్కి ధైర్యంబుఁదక్కి క్షుత్పిపాసాయు క్తచిత్తుండై వగలంగుంది భాగధేయానుమతి సుకృతదుష్కృతంబు లనుభ వించుచుఁ జచ్చుచుం బుట్టుచుందురు గాన,

హిందుస్తానితోడి—రూపకం

బాధనొందఁజాలనయ్య। పరమేశునిమాయఁజిక్కి ॥బా॥
పుట్టుట గిట్టుట నరులకు - గట్టిగ ధాతవిధించెను।
నట్టనడుమదురవస్థలఁ - బట్టి యఘము ఁ జెందనేల ?
పట్టి భద్రురాముమాయఁ - బ్రాకృతులట్లుద్భవించు।
నట్టి వృథాజన్మమేల ? యనఘ జనక యవతరించి ॥బా॥

మఱియు

సీ॥ ధరను వర్ణాశ్రమ♦ధర్మము ల్వెడిపాప కర్మంబులకుఁజిక్కి♦ క ట్టువడియెఁ। గులగోత్రనామంబు♦ లెలమివీడియునామ మాత్రావశేషమై♦ మలిన మయ్యె। బతిదేవతాధర్మ♦ పద్ధతుల్ కలవయ్యె♦ నరపాలు రన్యాయ♦ భరితులైరి। నిగమంబు లప్రమాణగతిఁ గుందువహించె విద్యావివేకంబు వెనుక తగ్గ।
గీ॥ నఖిల మతములు నేకమై♦ యఘము ప్రబలెఁ।
దొంటిమార్గంబులన్నియుఁ - దొలఁగి పోయె।
జాతి వైషమ్యములు హెచ్చు♦ జేరుఁగసాగ।
నిలను సుశ్లోకులేగతి♦ మెలఁగఁగలరు॥

వ॥ అట్టి జగద్దుర్దశ దళఖండింప శ్రీమన్నారాయణుండు బ్రహ్మజ్ఞానోపదేశం బొనర్చినఁగాని యుద్భవింపననిన బ్రహ్మరాతివైకుంఠపురంబున కరుగఁ గృతనిశ్చయుఁడై పురంబువెల్వడి నగరిసౌందర్యంబును, పర్వతౌన్నత్యంబులును, నదుల వైశాల్యంబును, మార్గమధ్యంబునఁ జూచుచుఁ జనిచని సాకేతపుర సామీప్యంబున నొక్క సుందరవనంబుండ నద్దానినేత్రోత్సవము నఁగాంచె; నందు పాంథుల సేదఁదీర్ప ధాతకోరినిర్మించిన నీలిగుడారములా

# యాజ్ఞవల్క్య చరిత్ర.

యఃసాలతాలతమాలహింతాలతక్కోలరసాలాదితరుచ్ఛాయలును, వెలిపట్టుబట్ట ధావళ్యంబును మీఱిచాలుచాలుగఁ గూర్చిన మంచిముత్యములగతి మొగ్గలువిలసిల్ల సద్గుణదంపత్యనురాగమునుఁబోలి యల్లిబిల్లిగానల్లిన వల్లరుల భారంబున కల్లాడుమల్లికావల్లుల శోభిల్లు పూఁబొదరిండ్లును, తెరువరుల క్షుత్తుఁదీర్ప నేతెంచిన యమృతకలశములో యనఁ బరిపక్వములై శాఖిశాఖికాంతరముల నందందు వ్రేలాడు ఫలంబులును, ఎంతమోరటులనైన హాయి హాయి యని సంతసంబున మైమఱువఁజేయు సంపంగి దవనము కస్తూరి పునుఁగు చందనము అగరు కురువేరులనుండి వీచుమలయమారుతమును సుధారసము వాఁకలయ్యెనో యన పువ్వులనుండి దొఱంగు మకరందమును, ఆపూదేనియఁగ్రోలి నల్లమబ్బుల ధిక్కరించు ఱెక్కలాడించుచు, ఝుమ్మన రొదఁజేయుచుఁ బైకెగసి మగుడఁగ్రోలుచు, నుత్సాహంబునఁ జెలరేఁగు గండుతుమ్మెదలును గౌరవర్ణంబునప్పుడప్పుడే బొటమరించుచున్న పిన్న రొలమావిచిగుళ్ళ హాయి నాని పంచమధ్వని యతిశయింప వీణాగానంబా యనఁబాడుమత్తకోకిల స్వనములును కమ్మగాయలమెక్కి యెడతెగని వైరమిదే యని యచ్చెరువొంద గోరువంకలతోఁ బోరుచు, ముదులొల్కు పల్కులాడు చిలుకలును గోటరకవాటములముంగిట గుబగుబలాడుచు రోమములుప్పొంగ నల్లిబిల్లితిరుగుచు మహావాయువునఁ దిరుగుపతంగంబును బోలి యాకసంబునకెగసి పల్టీలుకొట్టుచుండు వన్నెవన్నెలుగల పారావతములును, అందఱికన్నముం దరిగి సాఁగనిపెత్తనంబునకుఁ దలయొత్తు ననామకునిగతి నక్కడక్కడ నిక్కియున్న గఱికిపఱకలఁ గఱకఱ గొఱుకు చిఱుతకుక్కలును ముందగు తనగతిగానని పరద్రవ్యాపహారుని చెయిదంబులగతి వాతటిగాచి కాటందిభుజించి ఫణులఁద్రిప్పుచు లీలావిలాసముల మల్లెపొదలదఱినాడుచుండు త్రాఁచుపాములను దుశ్శీలునిఁగర్వంబిట్లగునన్నట్లు వానిపడగలఁబొడిచి భక్షించి కుంచెవిప్పి విహరించు నెమళ్ళును వానితఱివేచి పంజాతో మోదితిని భీకరత్వంబునఁజెలరేఁగు శా

ర్ధూలములును అవి నీరుగ్రోలుతావుఁబొంచి తొండమునవిటిచి యాహుతిఁ జేసికొను గొప్పమృగంబులగు మదకరీంద్రములును, వానికుంభములపైకెగ సి మెదడునుగ్రోలి సంహరించెడు మృగరాజులని పేర్వొందిన సింగములు ను వానిరక్తంబుపీల్చి నేర్పుశ శమనపురంబునకంపుచుండు శరభంబులు ను, చిత్రగతులనుంటఁజూచుచు సుకృతధామంబగు వైకుంఠనగరంబుసొ చ్చి యాపురవరసుందరత్వంబున కచ్చెరువొంది.

మంజరి

భళిరే యీపురిసోయగమెన్నఁగ ఫణిపతికిఁ దరంబౌనా ।
యలకాపురమైనను దీనికిఁ దీటగునే యెన్నఁటికైనన్ ॥

ద్వి॥ ఇలయందు ధనధాన్య॰ములు, నదులందు - జలము వృ క్షములందు॰ఫలములు నూతు - లందునజల గోవు॰లందు క్షీర ములు - బొందుగాభూమీశు॰లందు దర్పంబు - వనజాక్షులం దునఁ॰బతిభక్తిమహిమ - మనుజులయందు ధ॰ర్మప్రవర్తన యుఁ - బరఁగుచునుంటచే॰దురితముల్ దొలఁగి - నిరతంబు యశమున॰వఱలునీపురము॥

వ॥ అని తలపోయుచు దేదీప్యమానమై, స్వర్ణరత్నమయంబై, సకలతేజోభిరా మంబైన, యొక్క గృహంబుగాంచి యాసృష్టివైచిత్ర్యంబును మెచ్చుచు, బహిర్ద్వారంబునఁ బ్రవేశింప నం దఖిలదేశాధిపతులు నంజలు లొసఁ గుచుండ, త్రిదశేంద్రులు కొల్చుచుండ, భక్తశ్రేణి పలుగతులనుతింపు చుండఁ, దుంబురు నారదులు గీతంబుఁ బాడుచుండ, రంభోర్వశులునృ త్యంబు సల్పుచుండ, మౌనిబృందంబుకైవారంబులొనర్పుచుండ, వేధశ్శ మన జిష్ణు స్రష్ట్ర రుద్రాదులుఁ దమ పరివారంబులఁ గొల్వుతీరియుండ.

సీ॥ అనువైనశయ్యతా♦నమరిభోగీంద్రుండు వేయిఫణంబుల♦విప్పి
యాడఁ। గరిమబ్బుసరిమేనఁ♦గనకంపుఁబుట్టంబు సింగారము
ను విర♦జిమ్ముచుండ। దీర్ఘబాహువుల సం♦దీప్తమై వెల్గొం
దు పంచాయుధములెంతో♦భయముతోఁప । నొయ్యార
మునలచ్చి♦యూఁగునయ్యాలన వనమాల యురమందు♦వ
ఱలుచుండ

గీ॥ దివ్యరూపమున వెల్గు♦దేవవిభుని
లేనగవువాని జగముపా♦లించువాని
యోగనిద్రను శయనించి♦యున్నవానిఁ
బ్రకటితపరాక్రముని రామ♦భద్రుఁగనియె॥

వ॥ ఇట్లఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండగు నప్పరమేశ్వరునికి సాష్టాంగ
వందనం బాచరించి.

కేదారగౌళ — రూపకం.

శ్రీశసత్యభాషవేష । శేషశయనకావేర॥ శ్రీ॥
అ॥ భాసమానవిలాస । వాసుదేవస్వప్రకాశ
దాసహృత్కమలవాస । దనుజనాశ, త్రిజగదీశ॥ శ్రీ॥
1 పరమపురుష వేదవేద్య । భక్తవత్సలాకృపాళు
శరణాగతసంరక్షణ । సజ్జనావనా, నారాయణా
నిరుపమాకారధీర । సురవరశతపత్రనేత్ర
కరుణతోడ నేలుమో శ్రీహరిచక్రధారి, దైత్యారి॥ శ్రీ॥

సీ॥ వేదశాస్త్రాదుల♦విధులుదూష్యములవ, లై వర్ణసంకరం♦
బైననాఁడు । కులకాంతలెల్ల దు♦ర్గుణములవలసి స, తీత్వవ

ద్ధతిఁదప్పిఁతిరుగునాఁడు । కామక్రోధాది దుష్కార్యంబుల
ను జనుల్, మీఱుచుహింసలకుఁ మెలఁగునాఁడు। సత్యంబు
సమసి యసత్యంబు పెరిఁగి పాపమునకుఁ దరిలేక ప్రబలు
నాఁడు ।

గీ॥ శిష్టసంరక్షణము దుష్టశిక్షణంబు
సలిపి జగముల ధర్మంబు నిలుప నవత
రింప వే? నీదుమహిమ నుతింపఁదరమె?
సాధుజనపోష! సర్వేశ! స్వప్రకాశ॥

సీ॥ హేకృష్ణగావవే యని మొరలిడఁగద్రౌపదికి మానంబుఁగా
పాడినావు । తండ్రిబాధలు పెట్టఁదాళ లేకనుతించు, ప్రహ్లా
దునికష్టంబు బాపినావు । సవ్యసాచికి మేటిసారథివై కౌర,
వానీకములదర్పమడఁచినావు । పంక్తికంఠునిఁజంపి పౌల
స్త్యునకు లంకఁబట్టాభిషేకంబుగట్టినావు ।

గీ॥ ఘోరరాక్షసవర్గంబుఁగూల్చినాఁడ
వనయమతిప్రీతి భక్తుల మనిపినాఁడ
వట్టినీపాదకమలంబులనఘనాదు
భావముననిల్పి ప్రణుతింతుఁబద్మనాభ॥

వ॥ వాసుదేవా, మదీయజాయాగర్భాంతరావాసియగు నీబాలుం డేనువత్సరం
బులనుండి గర్భశోకంబునుభరించి మీవలన బ్రహ్మజ్ఞానోపదేశంబు గల్గినఁ
గాని యవతరింపనని త్వదుపదేశంబున కెదురుచూచుచున్నవాఁడు గానఁ
దామందుల కియ్యకొని మదీప్సితంబు నెఱవేర్పుండన వల్లెయని భగవంతుం
డాయర్భకునకు నుపదేశంబుఁజేసి నిజేచ్ఛంజనియె. నంతమునంద శౌకనుము
హూరంబున.

దర్బారు—రూపకం.

ఉద్భవించెనాసునంద-కుత్సుకత్వ మొదవసుతుఁడు॥ఉ॥
సురగరుడోరగకిన్నర। సుముఖులెల్ల హర్షంబున। విరులవానగురి
యింపఁగ। వరదుందుభిరవము మ్రోయ। మురహారునియప
రావతా,రమని మురిసిజనులుపాడ।విరివిఁగ సకలభూతముల్,
వినుతిఁ జేయ, నఘముఁ బాయ॥ సు॥

వ॥ ఇట్లుద్భవించినతత్క్షణం బాకాశవాణి,

గీ॥ సద్గుణాఢ్యుండు రవికిసంఛాత్రవర్యుఁ
డమితతేజోభిరాముఁ డత్యంతకీర్తి
చరితుఁడై శుక్లయజువుఁ దాఁ గఱచియాజ్ఞ
వల్క్యనామంబునన్ భువిఁ బ్రభవహించు॥

వ॥ అని ఘోషింప నావాక్యంబుచొప్పున బ్రహ్మరాతి సకల బంధుపురోహి
తులయనుమతిఁ దనకొమరునకు "యాజ్ఞవల్క్యుం"డను నామకరణం బిడె.
పిమ్మట నాబాలుండు బాలసోమునిపగిది దినదినప్రవర్ధమానశరీరుండై పెరుఁ
గ నైదవవత్సరంబున విద్యాభ్యాసం బొనర్పఁదలఁచి,

ఉ॥ శ్రీహరిపాదయుగ్మసరసీరుహమత్తమిళిందరూపు దు
ర్మోహవిసర్జితున్ సుగుణపుంజు మహాత్మకు వ్యాసుఁగొల్చియు
త్సాహ మెలర్పఁ బుత్రకుని సారకళాన్వితుఁ జేయ వేఁడ నా
శ్రీహరిభక్తుఁడొప్పికొనె శ్రేష్ఠుని నాతనిశిష్యుఁగాఁ గొనన్॥

వ॥ ఇట్లు ఛాత్రునిగా నియమించుకొని కొండొకకాలంబునకు.

మంజరి.

తర్కవ్యాకరణాదిశాస్త్రములఁ దక్షుఁడగుచుఁ దానేర్చె
కర్కశత్వమునుమాని ప్రేమమెయిఁ గాంక్షలన్నిటిని దీర్చె॥

వ॥ ఇట్లు వేదవ్యాసుఁడు యాజ్ఞవల్క్యు నతిప్రేమంబున సకలశాస్త్రపారంగతునొనర్చి యజుర్వేదాధ్యయనంబునకుఁ దనయంతేవాసియగు వైశంపాయనునికప్పగించి చాంద్రాయణంబుఁ జరిపింపఁజనె. పిమ్మట నొకదివసమ్మున సాత్యవతేయుని శిష్యులందఱు గుమిగూడి యొక్కదినంబు నిర్ణయించుకొని యాసమయమునను,

సీ॥ మేరుపర్వతమున సభ చేరవలయు
నచటికేవఁ డరుగుదెంచఁడో యట్టివాఁడు
వసుధ నేడవదినమున బ్రహ్మహత్య
బాఱిఁబడునని శపథ మేర్పఱచుకొనిరి॥

వ॥ అందుకు వైశంపాయనుం డచ్చోటికరుగక తన నూర్గురిశిష్యులఁ గూడి విద్యావ్యాసంగంబునఁ బ్రొద్దుఁబుచ్చుచున్నంత.

మ॥ ఒక్కనాఁ డొకబాలుఁడన్నిట యోగ్యుఁడై చెలువొందువాఁ
డక్కజంబుగ నాగమంబు నహర్నిశంబుఁ బఠింపుచుఁ
జక్కనొక్కటిఁ దప్పనయ్యు ది స్వాంతమందుఁ దలంపకే
యక్కటా ఋషితన్నెఁ దన్నది యర్భకున్గడ తేర్చెఁబో॥

చ॥ గురకకలంపఁ గాయమది కుమ్మరిసానవిధాన నెంతయో
గిరగిరఁ దిర్గ మోముపస క్షీణదశన్గన రక్తధారలా
తురముగ నేలఁబర్వఁగడు ధూళికనుంగవఁగప్ప నక్కటా

హారిహారి శ్రీహారీయనుచు॰నాతఁడు జీవముపీడె నయ్యెడన్॥

వ॥ ఇట్లు విగతప్రాణుండైన బాలుఁగని చేయునదిలేక తీవ్రపడియున్న వైశంపాయను నతితీవ్రతంబుగ నొక్కవిప్ర పిశాచంబు వెంటంబడిన.

మంజరి

గురువునకీ యెడ వెట్టిపుట్టెనని ॰ గోడు గోడు మనిబాలుర్ ।
దురపిల్లుచు గేహములందున॰దూరిరిభయవిస్మయములతోన్॥

వ॥ ఇట్లు విప్రపిశాచంబునకు భయంపడి వైశంపాయ నుండు. శోకఘూర్ణిత మానసుఁడై పలుగతుల విలపింపఁదొడంగె ॥

ముఖారి—రూపకం

ఏమిసేతు దైవమానాకేమిదోఁచదాయె నకటకటా ॥ఏ॥
అ॥ ప॥ యీమహిం భగినీతనూజు । నిటులఁగో ల్పోయినదిగా ।
కీమహాపిశాచముచే । నిటులఁగుందవలసి వచ్చె ॥నే॥
శ్రద్ధతోడ నొరులకన్న । విద్దెమిన్న గఱపశిశు । నొద్దికతోఁజేయ బ్రహ్మహత్య మెడకు చుట్టుకొనియె । ముద్దుగఁజుట్టమని పోవఁ బెద్దదయ్య మైతఁజిమెడి । తద్దినంబుడబ్బు వెట్టె । తగిలించు కొనినటులాయె ॥నే॥

వ॥ "పుణ్యాం కర్తుంగతవతిజనేషాప మభ్యాశమీతి" అనురీతి నీ శిష్యుని విద్యాభివృద్ధికై సదభిప్రాయుఁడనై యొనర్చిన దండన ఫలమీ పిశాచంబై పీడింపఁజొచ్చె నక్కటా ! యీపాడుదయ్యపుబారినుండి తప్పించుమహాత్ముండొక్కఁడయిన నిందుఁగలవారిలోఁగానరాఁడయ్యె.

మంజరి

అకటానీతాధవు నారసమున । కైనసోర్వఁగనువచ్చునే ।
వికటమతుల దండించుకృతాంతుని । బింకమునాపఁగవచ్చునే ॥
వపగిదినిభువినెంతెంతిడుములు ♦ నేర్పడఁ దాళఁగవచ్చునే ।
బాపురె యబ్బా యీబ్రహ్మహత్య ♦ బాధఁజూడఁ గడుహెచ్చు ॥

వ॥ ఇట్లనేకగతుల బాధలఁగుందుచుండ సునందనీనందనుండుగని యాచార్యు నిబాధందప్పించుట కర్తవ్యంబనితలంచి తానేర్చిన యధర్వణాగమమంత్రంబుల భూతంబుపై నుచ్చాటనంబుసల్ప నాభూతంబు నిలువనేరక వైశంపాయనునివీడి చనియెనంత సకలసురముని బృందంబులు.

బిలహరి - ఏకతాళము.

నీశతగును యాజ్ఞవల్క్య - నిఖిలలోకగురువర్య ॥ నీ ॥
అ॥ప॥ భీకరమగునీశక్తిని - విష్టపత్రయములరక్తిని
ప్రాకటమగుగురుభక్తిని బారఁదోలితివిముక్తిని ॥ నీ ॥
1 కోరిసాధులరక్షింపఁ గుజనులనుశిక్షింప
ధారుణివేదములనిల్ప - ధర్మములనుద్ధరింప
భూరిరూపమునజనించిన - మూర్తిత్రయమనిపింపఁ
గ్రూరులగుచు నెరులకొంపఁ - గూల్చువారిబుద్ధిమాన్ప॥నీ

వ॥ ఇట్లునుతించినపిమ్మట, కొండొకకాలంబునకు వైశంపాయనుండు తనశిష్యతతితో మిథిలాపురంబునకరిగి యుచ్చుట.

చ॥ జనకధరాపురందరుని ♦ శాంతనిధిన్ఘని తత్సభాంతరం
బునఁ దమశక్తిసంపదలు ♦ పూర్ణముగాఁగనుపింపఁజేసియు

య్యనఘునిగౌరవంబుఁ గొని • యయ్యెడఁ గొన్ని దినంబు లుండఁ గో
రినయతఁడ యయ్యెడన్ నిలువఁ • బ్రీతిజనించుటనుండియొక్కటన్

వ॥ అందు తనశిష్యులనూర్గుర నొక్కొకదినంబున నొక్కొకరయ్యధిపు నాశీర్వదింపఁ బంపించుచున్నయెడ నొక్కనాఁడు యాజ్ఞవల్క్యుని వంతగు దినంబు వచ్చినంత నాఁడు జనకుండేలు మిథిలాపురంబుడగ్గఱఁజేగి తత్పురసౌందర్యంబున కచ్చెరువొంది భావంబున నిట్లని తలంచె.

హిందూస్తాని తోడి - ఏకతాళము.

ఆపురంబు సిరికాపురంబున - కయ్యలకాపురంబు ॥ ఆ ॥
ఏపుదీరినకోటల్ - బలు - కాపుగలుగుతోఁటల్ - భళీ -
ప్రాపుగల్గుపేటల్ - మే - ల్జూపజాలు బాటల్ అరెరే ॥ఆ॥

వ॥ అని యనుకొనుచు సభామంటపంబుఁ దఱియం జొచ్చి.

చ॥ జనకమహీధవుండు విల • సన్మణిపీఠమునందు లేమిఁ దాఁ
గనియతఁడేగుదెంచుటకుఁ • గా నిలువన్ జను ప్రొద్దటంచునో
య్యనఁ దనకార్యముల్ చెడున • టంచుఁ దలంచి మృగేంద్ర
విష్టరం । బుననుని చెన్ గడంకజప • పూతమహోక్షిత రాజి
నాతఁడున్ ॥

వ॥ ఇట్లు వైచిన నక్షతతండులంబులు యాజ్ఞవల్క్యభూసురాశీర్వచన ప్రభావంబున దారుశిలాయంత్రంబులు జీవంబులుగా వెలసినట్లుండె నంత జనకమహీధవుండయ్యదిగని నేఁడెంతటివింతఁ గంటిమని నివ్వెఱపడి నేఁడాశీర్వదించిన విప్రోత్తముండు రేపటనరుగుదెంచునట్లు చేయుండని వైశంపాయనుఁ దెలియఁబఱచిన వైశంపాయనుండును యాజ్ఞవల్క్యునిఁ గని యిట్లనియె,

క॥ జనకక్ష్మాపతికల్గమి
ననవసరంబనక సిరి • నాశీర్వాదం
బునఁ బూతఁజేసితఁట నీ
వనఘా నేఁడరిగిచేయు • మాశీస్సునృపుక్ ॥

వ॥ అని యానతిచ్చిన గురునివాక్యంబులకులికి యీగురుండెంతప్రాజ్ఞుండో నా విద్యాభివృద్ధినడంపంగాఁబోలు నేఁడుఁగూడ భూపాలుసన్నిధికిఁ బంపఁదలపెట్టె నిదియెటులైనఁదప్పఁ జేయుటయే యర్హంబనితలంచి

హంసధ్వనిరాగము - తిశ్రజాతి - ఏకతాళం.

మేలుమేలు, చాలుచాలు, కీలెటింగితిక్
బాలిశుఁడనియెంచి యిట్లుపలుకఁజొచ్చి తో
దినమున కొక్కొక్కరనుచుఁదివిరిపల్కుము
జనుము చనుమటందు వేటిసత్యవచన మక్కటా ॥మే॥
చదువు పాడు చేసికొనుచుఁజనఁగ నొల్లనేనికె ।
ల్లిది యెదెట్లు సేయుమన్న, ముదమునగాని ధీవరా ॥మే॥

వ॥ అని మొగమోటము లేక పలికిన శిష్యుంగని వైశంపాయనుండు.

ఉ॥ శ్రీయుతుఁడాధరాధవుఁడ• శేషవిధిజ్ఞుఁడు నీదు పూర్వపు
ణ్యాయతసంపదక్ మునిజ•నావళిమెట్టిగఁ జేయనెంచిని ।
న్నీ యెడఁబిల్వనంపఁజన•నెంచవిదేమిటి కయ్యవారిరిక్ ।
జేయఁగఁబోవఁ గోతియగు•చిహ్నముదోఁపఁగఁ జేసితేభళీ ॥

మంజరి

గుగుఁడునుఁ దండ్రియుదేవుఁడు నెయ్యది•గూర్తర దేఘనమంచును

దా । శిరమునఁ దాల్చినవాఁడె ఘనుండగు శ్రేష్ఠుఁ డనందగు
ధారుణిలోన్॥ 2 నీకర్మంబటులుండి యుండఁగా నిల్పునె నా
నుడి లెమ్మా। నాకడ నేర్చిన విద్దెలెల్ల మఱి నయమున నాకిపు
డిమ్మా ॥

వ॥ అని రోషావేశంబున గద్దించి పలికిన గురువాక్యంబులు సహింపఁజాలక నీ కడ నేర్చిన విద్దెలెల్లనివియె గైకొమ్మని యోగసామర్థ్యమున మూర్తిమంతంబులగు వేదాది విద్యలన్నిటిని నూర్ధ్వముఖంబున వెడలఁగ్రక్కిన నది ప్రళయానలంబు చందంబున మండి జగంబెల్ల దహింపుచున్నంతఁ బాదరాయణుం డేతెంచి యావికృతమున కచ్చెరువంది.

గీ॥ అయ్యయో యిట్లు సేయంగ నర్హమగునె
శాంతమయమైన వేదంబు శాంతి వీడి
యాజ్ఞవల్క్యముఖోద్గమునం బై ధరిత్రి
నగ్నికం బెనుమండి మేలార్పఁదొడఁగె॥

వ॥ అని పలికిన యాచార్యునితో వైశంపాయనుం డిట్లనియె.

చ॥ గురువర యాజ్ఞవల్క్యుఁ డనుకూలప్రవర్తను డింతగాఁడు
నన్ । సరకుగొనండు విద్యలఁ బ్రసంగములందుఁ గుతర్క
వాదియై। పరువిది కాదు నీకనినఁ బల్కు వినం డెదిరించియా
డుఁ దా । గురునకుఁ బంగనామములుఁ గూర్చెడు శిష్యుఁ
డితండె చూడఁగన్॥

వ॥ అంత వ్యాసుండు కమండలూదకముఁ బ్రోక్షించి యయ్యనలజ్వాల నుపశమింపఁజేయ వారి యనుమతి బోధాయనాపస్తంబ సత్యాషాఢాది ఋషు

లందఱు తమయందుండు వేదంబులసయితము యాజ్ఞవల్క్యుఁడాకర్షించి కక్కినహేతువుంబట్టి యాయజుర్వేదఖండంబులు భక్షింపనాసించి స్వస్వరూపంబుల నట్టికార్యంబు దుర్ఘటంబును జుగుప్సాకరంబగుట శంకించి తిత్తిరిరూపంబులభక్షింపుటచే నావేదశాఖలు తైత్తిరీయశాఖలనఁ జేర్కొనంబడియె. మఱియు,

చ॥ మునులుఖగస్వరూపములఁ • బూనికనాగమశాఖలన్ గ్రసిం
చినకతనన్ మలీమసతఁ • జెందుటఁ కృష్ణయజుస్సనాఁగనం
దునవొకశాఖవెల్వెడలెఁ • దున్కలుతున్కలుగాఁగనెన్నియం
దునఁదగఁ జెడ్డకాలమదిఁ • దోఁచిన నెంతటినష్టమబ్బదో॥

వ॥ ఇట్లు గుర్వనుజ్ఞ న్వేదంబు తనచే వీడంబడుకతనఁ దన యాగమస్వాధ్యాయత్వంబునకు భంగంబాదవెనని యాజ్ఞవల్క్యుండు గాయత్రి నుద్దేశించి.

ముఖారి—రూపకం.

నీ, మహిమలుగననలవియె-సామజనేత్రాగాయత్రీధరిత్రి ॥నీ॥
1 ఏమనుజుండైననుని న్నేమమునసదానుతింపఁ - గామితములొసఁగుదానవు, గావెలోక, పావనీ, జననీ॥ నీ॥
2 సురుచిరభక్తిఁద్రికాల। ముల నిన్నెడకఁదలఁచిన । నరుఁడె కృతార్థుఁడు కిల్బిషహరుఁడు పుణ్యయుతుఁడే । హరిహరవిరించనులు నిన్నరయలేకపోయిననే । నెఱిఁగినుతులుసల్పుదునేళ గ్రహించికావుమంబా॥ నీ॥

ఉ॥ అమ్మరొామద్గురుండు కుటిలాత్ముఁడు తామునుజెప్పినట్టి వే
దమ్మునుగ్రమ్మరన్ వెడల • ధాత్రినిఁగక్కుమటంచు రో

మ వాక్యమ్ముల నాడెనేనటులఁ • గ్రక్కితి వేదచయంబుఁజె
చ్చెరన్ । సమ్మతినొందు వేదమున • నన్గృతకృత్యునిఁజే
యుమంబికా ॥

వ॥ ఇట్లు ప్రార్థించిన మునితల్లజునకు గాయత్రి ప్రసన్నురాలైయో మహర్షి
సత్తమ! నీకోరినవరంబులొసఁగెదంగాని తొల్లి నాయందనంతంబులైన నిగ
మచయంబులుద్భవిల్లె నందు శబ్దబ్రహ్మమయమగు శుక్లయజుస్సును శ్రీ
మహావిష్ణువు భవిష్యద్వృత్తాంతంబెఱింగి భాస్కరుని మఱుఁగునను౦చెఁ ద
క్కిన ఋగ్వేదాదియామ్నాయంబులు భూలోకంబునఁ బ్రభవిల్లెఁగావున
నీవాభానునికడకేగి యతనిచేగుప్తంబగు శుక్లయజుర్వేదంబు నాయనుమతి
గ్రహించి రమ్మని పుత్తెంచిన నాయాజ్ఞవల్క్యుండు వాయుభక్షుణచేఁ
బ్రాణాయామంబున భక్తినిశ్చలాత్ముఁడై దినకరునిస్తుతించె.

హిందూస్తాని బేహాగ్ - ఏకతాళము.

పతితపావనా సజ్జనావనా భక్తపాలనా
గతినీవేయని నమ్మితిని త్రత్రిఁ - గావవేదయన్ ॥ ప ॥
నీదుకాంతినిలోకమూతయు - నిండియున్నది
యోదయామయాదీనకబంధో - సాధుపోషణా ॥ ప ॥
సకలవేదశాస్త్రాదిమంత్రములు - సచరాచరములును
ప్రకటితముగ నీయాజ్ఞనుండవే - భాస్కరానమో ॥నమో॥

వ॥ ఓజగద్బాంధవా? త్రికాలంబులకరుస ఋగ్యజుస్సామ వేదస్వరూపంబుల
బ్రహ్మరుద్ర విష్ణు హృదయుఁడవై, యేకచక్రరథారూఢుండవై, ఛాయా
సమేతంబున నాకసంబునఁజరించు ప్రత్యక్షదైవమవగు నీమహిమంబుగాన
క ప్రాకృతునిఁగాసెంతురు. దేవదేవా? దివాకరా!యని యిట్లభినుతించు

మునిపుంగవు నెడం గరుణించి మార్తాండుండు వాజిరూపంబునఁ బ్రసన్నుం డైన, బ్రహ్మరాతినూనుండు సాష్టాంగవందనం బాచరించి యిట్లని స్తుతించె.

దండకము.

శ్రీమన్మహాదేవ దేవేంద్రముఖ్యామరస్తోత్రచారిత్ర ఛాయాధినాథా మహాభావమూర్తీ త్రయీకారలోకేశ నీసన్నిధానంబులన్ విద్దెలన్నేర్వఁ గాయత్రినన్నంపె నీర్వ్యాపరీతాత్ముఁడై మున్ను తానేర్పు వేదంబులన్ గ్రక్కు నన్ గ్రక్కుమంచు న్గురుండాడ నవ్వాని వాక్యార్థఘటింపం దాళఁగాలేక నేనూర్ధ్వభాగంబునన్ గ్రక్కితిన్, యాజుషామ్నాయశూన్యుండనైతిన్ కృపాభావముప్పొంగ నీదీనునిన్ శిష్యుఁగాఁ జేసి వేదంబులిమ్మా జగత్సాక్షిభూతాది దేవానలోకైకవంద్యా నమస్తే నమస్తే నమస్తే.

వ|| ఇట్లనేకగతులఁ బ్రార్థింప సకలవిద్యాపారీణుండును వేదమయుండును వాలఖిల్యాదిఋషి బృందపరివేష్టితుండగు శ్రీ సూర్యనారాయణుం డవ్వానిం గరుణించి యాజ్ఞవల్క్య మనోనిశ్చయ మెఱుఁగఁగోరి వత్సా.

చ|| అరనిముసంబు నిల్వక ర♦యంబున నేగుదు మింట విద్దెలన్
గఱపఁగ నీకు నెక్కుయెడఁ♦గాఢము మాత్రము నిల్వరాదు నే
నరుగక యున్న సర్వమును ♦ హావళి నిన్ గనునొండు పాయమే
నెఱుఁగఁగఁ జేతు దాన గ్రహి♦యించి చరింపుమి విద్దెయబ్బెడిన్

వ|| అదియెద్దియన.

మంజరి.

1. అనిలుని చెంగటఁ దేజోబలముల ♦ నందిన యశ్వములుండెన్
గొని తెమ్మయ్యు వినారథంబువడి ♦ గూడ జవంబున నరుగున్||

వ॥ అట్టితురంగంబులాలోచించి నీవునాకడ విద్దగఱతువని పలికిన భగవానుం డగు నినునియనుజ్ఞవడసి కడలిదరికేగి పవిత్రాత్ముండగు నగ్నిదేవునిట్లని ప్రార్థించె.

పంతువరాళి - రూపకం.

సరగునఁగావఁగారాదే। స్వాహామనోబ్జభృంగ॥ ప॥

అ॥ప॥ పరమపురుషనీమహిమలు-బ్రహ్మేంద్రాదిసురులైన
నెఱుఁగలేకయుండనాకుఁ-దరమేనినునుతియింపఁగ॥ స॥

1 వీతిహోత్రసురమునీశ- వినుతాఖిలదురితనాశ- పూతచరి
త స్వప్రకాశ- భువనత్రయభక్తపోష - జాతవేద భానుని
యంశనుజనించినట్టిమేటి- వీతియుగ్మములనొసఁగి- యాతు
రమతిఁగాచుటకిటు॥ స॥

మ॥ అనఘాభాస్కరవాహసంచయమునీ॰ యందుండెనద్దానిని॰
గొనియారోహణముంబొనర్చి యుల॰భానున్గొల్చి నేనాగమం
బునుఁగైకొందుదయావిశేషమతినా॰ పూస్కగ్గదుస్సభక్తపా
లనశీలా॰కరుణించితీర్పఁగదె మేల్॰కైకొందుస్వాహాపతీ॥

వ॥ ఇట్లు వేఁడినంత వీతిహోత్రుండు కరుణాంతరంగుండై తనకడనున్న వాజి యుగంబు నాయాజ్ఞవల్క్యునకిచ్చె. నంత వారిండవిగొని అనంతకోటి స్వరూపుండును, దివ్యప్రభావుండు నగు భానునికడకరుగ నమ్మహాత్ముఁ డు ఋషివరునిసామర్థ్యంబున కచ్చెరువొంది వాజిరూపంబునఁ బ్రసన్నుఁ డైన యాజ్ఞవల్క్యుఁ డద్దేవుకటాక్షంబున.

మంజరి.

అతఁడయాతయామంబను పేరున • నలరినశుక్ల యజుస్సుల్
సతతముకష్టంబనకపఠించెను • చండమయూఖుని చెంతన్॥

వ॥ ఇట్లు సేర్చి.

గీ॥ ఇనునియనుమతిఁగొని మర్త్య • మునకు దిగెను
నతని నడ్డగించె చిత్రర • థాఖ్యనెసఁగు
నొక్క గంధర్వుఁ డధికరో • షోత్కటుండు
చదువువిద్దెను జయమంది • సాఁగుమనుచు॥

శంకరాభరణం—రూపకం.

నిలుమా పౌరుషముండినమానిసివై ననుదోలఁగకవిప్రాధమా॥ ని
అలదివాకరునియొద్ద। నామ్నాయముఁబఠించి విద్దెల జయ
మందక భువికిన్ ధీరతనరుగుచుంటివే। నడిగినప్రశ్నములకు
దాహరణమిచ్చిచనుమట్టుల। సలుప వేనియిటనుండి। సాఁగ
నీయ నడుగ్గై నను॥ ని॥

వ॥ అప్రశ్నంబు లెవ్వియనిన.

సీ॥ హరిహరబ్రహ్మాదు • లందుఁ దానాదిమ, స్థితివహించిన గుణ •
శ్రేష్ఠుఁడెవఁడు। వేదముల్ శాస్త్రముల్ • విధివిరామము లేక,
యెవ్వానిగుణముల • నెంచుచుండు। సకలచరాచర • జంతుజా
లంబులె,వ్వని శాసనంబున • వఱలుచుండుఁ । జంద్రసూర్యా

గ్ను లేఁ స్వామియాజ్ఞవహించి, క్రమముదప్పక యె యఁ ర్హా విధినుండు ।

గీ॥ రెవఁడు దైవంబసంగ నెం దేఁ జెలంగు
సకలమెవ్వఁడు నెవ్వాని ప్రకటయశము
దశదిశావేల్లితంబయి తనరుచుండెఁ
జెప్పుమాతనివిజ్ఞాన సిద్ధియలర॥

వ॥ అనియడిగిన గంధర్వతల్లజుప్రశ్నంబులకు యాజ్ఞవల్క్యుండు దరహసిత వదనుఁడై యిట్లనియె.

మంజరి.

1 నీవువచించిన ప్రశ్నంబులకును నిర్గుణతత్వంబొకఁడె
భావంబునఁదలఁచిచూడు భక్తుల పాలిటదైవంబతఁడె॥

వ॥ అని యుక్తియుక్తముగా, ప్రశ్నలన్నిఁటికి సదుత్తరములిడినంత గంధర్వుం డు సంతోషాంతరంగుఁడయి, మునివతంసమా! నే సహస్రాక్షునిపంపున నిన్నుఁ బరీక్షింపఁజను దెంచిన గంధర్వుండను గాని సామాన్యుండను గాను. సర్వజ్ఞులరగు మీమహిమ నెఱుంగక ప్రాకృతబుద్ధిమాత్రునిఁగ నెంచి కుతర్కవాదమునర్చు పురోభాగు లిహపరసౌఖ్యములకు దూరులై దుః ఖోపతాపదారిద్ర్యపీడితులగుదురు. నాయొనర్చిన యపరాధమును క్షమియిం చి నన్నుధన్యునిఁజేయ వేఁడెదనని యమ్మహాత్ముని ముదలచే నంతర్థానుండ య్యె. పిమ్మట యాజ్ఞవల్క్యుండు మిథిలాపురాధీశుండగు జనకుండొనర్చు నధ్వరంబున కఖిలమునులును గొందఱు విప్రులు.

పూరికల్యాణి—ఏకతాళం.

త్వరగా రావదేమోయి అట॥ దప్పిపోవునుపప్పుధప్పళాల్॥ త్వ॥

గారెబొబ్బట్లప। కమ్మగాచినకందిపప్పప। కోరినన్నిపూర్ణాలు
బూరెలుపడవేతురప॥ త్వ॥ 1 దండిహోళిగలు లడ్డుయుం
డలు తెగవేతురప - పండితులకురూకప - ప్రాకృతులకు
బేడప॥ త్వ॥ 3 వేలకొలఁది గోవులదానాలుయిత్తురప-
మంచిశాలువల్ బహుమతులనిచ్చి సంతసింపఁజేతురప -
చాలునన్నవరరాజ్యము చేరలాదిపోతురప। యోలలాడఁ
జేతురప। వేళమించెదక్షిణలకు॥ త్వ॥

వ॥ ఇట్లనేకగతుల నొకరితో నొకరు చర్చింపుచుఁ జనుచుండఁ దానాసవనంబుసరిగి యచ్చటవిధులన్నిటఁ దానాదినిఁబూజింపఁబడుచుఁ గొన్ని దినంబులుండ నొకదివసంబున జనకధరావల్లభుండు, కొల్వుఁదీర్చి మునిమండలంబున్గాంచి.

సీ॥ భద్రమణిరత్నభూషణంభర్మమయసు
వసనములఁదుష్టినొనరింతుంబ్రహ్మవిద్య
నెవ్వఁడధికుండొవాని వంచింపరయ్య
వానిదీవన బ్రహ్మదీవనయెగాన॥

వ॥ అనిపలికిన జనకునివాక్యంబులు విని యచ్చటంగల మునులందఱుఁ దమతమ తారతమ్యంబు లెఱుంగక మిథ్యావివాదంబులు పలుకుచుండునంత శ్రీయాజ్ఞవల్క్యుండు తనయన్తేవాసియగు సామశ్రవునిం జీరఁబిలిచి.

మంజరి.

1 మనయాశ్రమమున విద్యార్థులు మునుగొనిచనుమదివలదం
చనువనీతుల మర్యాదములకునగుచవాలు నేనిదుడు॥

వ॥ అని యాజ్ఞవల్కుఁ డనయాశ్రమమునకుంచి తనతో విద్యావివాదంబుసల్పు అశ్వ్యలు, నార్తభాగ, చాక్రాయన, యుద్దాలక, లాహియాయన, కహోలాది మునిపుంగవుల కందఱ కన్నిరూపులఁ దగుప్రత్యుత్తరంబుల నోటువడఁజేసె. పిమ్మట శాకల్యుఁ డతిరోషానలదగ్ధమానసుఁడై వానిఁ బ్రశ్నింపుమన యాజ్ఞవల్క్యుం డిట్లనియె.

సీ॥ మనకిపుడు ధర్మకూర్చయె • మధ్యవర్తి
యైయెసంగిన నపజయ • మందువాని
శీర్షము సహస్రఖండముల్ • సేయుననుచుఁ
గూర్చ నిరుప్రరిమధ్యను • గూర్చిరపుడు॥

వ॥ ఇట్లు బ్రహ్మగ్రన్థి వేసినకూర్చమును మధ్యనిలిపి వివాదంబొనర్పఁ గొంత తడవున శాకల్యుం డోటువడి యాకూర్చాతాడనంబున మృతిఁబొందె, పిమ్మట విదేహరాజు శాకల్యునిఁ గన్గొని యీతండు పశ్చాత్తాపమొందినందున బ్రహ్మహత్య తారసిల్లెం గాన వీని బ్రతికింపుఁడని వేఁడిన వా నునందా నందనుండు.

మంజరి.

1 జనకజమహారాజుహర్షమొందఁగఁ • దనకమండలూదకముఁ
బునర్మనయను వేదమంత్రమునఁ • బ్రోక్షించెను లెమ్మనుచున్.

వ॥ ఇట్లు యాజ్ఞవల్క్యమహిమంబున శాకల్యుండు నిద్రనుండి మేల్కాంచి నరీతి ఋషిరల్లజబృందం బచ్చెరువందఁ నలీవుఁడై బ్రహ్మరాతితనూభవునకు సాష్టాంగవందనం బాచరించి యిట్లని స్తుతించె.

కేదారగౌళ—రూపకం.

తావకమహిమంబెఱుంగఁ- దరమేరికియాజ్ఞవల్క్య

ఆ॥ వేదవేదాన్తవేద్య - విమలభావసుగుణధామ
ద్వాదశాత్మావతార - దాసపోషత్రిజగదీశ ॥ తా ॥

1 శాకల్యప్రాణదాయ జనకేశాయ - శాన్తాయలోకాచార్య
వర్యాయ - వివేకానన్దనిత్యాయ - పాకారిప్రముఖవినుత
బ్రహ్మేశవిష్ణురూపాయ - కరుణాలవాలాయ యోగిరాజా
ధిరాజాయనమో ॥ త ॥

వ॥ ఇట్లనేకరీతులనుతించె యనంతరంబామునులు కృతాంజలిబద్ధులై.

సీ॥ మాతృగర్భమునుండి • మహిజనింపకమున్నె, హరిగురుం
డనిక్రియ•లరసినావు। బ్రహ్మహత్యనుబాధ•పడెనఁ వైశం
పాయ,మునిఁగాచి బాలుని • మనిపినావు। ఆర్యవంద్యంబు
న • యాతయామసువేద, మర్జాప్తుకడనేర్చి • యలరినావు
సత్సభాంతరమున • జనకుఁడుమెచ్చఁ బాం,డితినెల్లమునుల
నో•డించినాఁడ।

గీ॥ వనఘుతావకమహిమ మి•ట్టట్టటంచు,
తెలియకెప్పుడె శాకల్యుఁ•డెలమిఁజూప
మృతునిఁగాఁ జేసి పిమ్మట • బ్రతుకఁజేసి
నావు సామాన్యుఁడవ్వుకొ యె•న్నఁగనీవు॥

వ॥ అంత మిథిలాపురాధీశుండు యాజ్ఞవల్క్యుని మహిమంబుఁ బూర్తిగాఁగ
నుఁగొనందలంచి సకలఋషివల్లభులతోడ నొకదివసంబున.

దర్బారు - రూపకం.

కొలువుతీరెజనకరాజ - కుంజరుండుప్రీతితోడ ॥ కొ ॥

1 వెలయఁగ సచివబుధబృందము - వరుసఁదీరి గొల్చుచుండ
నిలఁగలసన్మండలేశ్వరులు ప్రాంజలులొసఁగుచుండ
గడుభక్తి వందిమాగధుల్ - కైవారములిడుచునుండఁ
బలువిధములయిన నాదముల్ - చెలఁగుచుండ - చెన్ను
మీఱ ॥ కొ ॥

వ॥ ఇట్లుకొల్వుఁదీఱి మునిజనసమూహముగాంచి.

చ॥ మునివరులార తొంటియఁగు • ముఖ్యురుఁగఁ బిత్రువర్గ
ముల్ సదా ।
ఘనముగ స్వర్గసౌఖ్యమును • గాంచమదన్వయముల్లసిల్ల నీ।
కనకపుసారథేయులను • గౌరవమొందగనిఁదలంచితిఁ
గొనుటకునర్హులెవ్వరొయు • కుంఠమతిఁ గొనుఁడీసభాస్థలిఁ॥

వ॥ అనిస్వర్ణమయంబగుగోవుల సభయందు నిల్చినవాని నాయాజ్ఞవల్క్యుండు
తన ప్రియచ్ఛాత్రుండగు సామశ్రవునిఁ గొని చనుమనునంతలో సహించనేరక
యాశైలంపాయనాదులు॥

మాజఁ.

1 ఇందఱికంటెనుఘనుఁడొకొ ముందర • ముందరఁ జేరిగొనంగా
నెందునఘనుఁడో తెలుపకచిందర • నందరఁ జేసిచనంగా ।

వ॥ అనురోషవాక్యంబుల మొందరిగి యా కనకధేనువుల సభయందుండి
గొనిచనుచుండ, భగవత్స్వరూపుండగు యాజ్ఞవల్క్యుఁడు తన మంత్రబలం
బులకమనకింకరుల రప్పించి భర్మకారవేషంబులు వేయించి భర్మధేనువునపహ
రింపుఁడని పనిచినవారలాభూమురుల కడ్డంబువచ్చి.

కేదారగౌళ॥ ఆది

చాలునయ్యాయిదియేటి • సబాబుదొరగారు ॥చాలు॥

1 ఏడన్నైనప్రాణము లేనట్టిపసువు లోకమందు • జూడబాప
నాళ్ళుగొనెడి పోద్దె మెందుగలదె, ॥చాలు చా॥

2 పప్పుకూడు మీదిసామ్ము - చెప్పుకూడు మాదిసామ్ము
దప్పళాలు మీదిసామ్ము-దొప్పనత్తురుమాదిసామ్ము చా॥

వ॥ ఇట్లు పలికిన చండాలురంగని ప్రతివచింపనోడి నివ్వెఱపడిచూచునంత యాజ్ఞవల్క్యుండు జనక భూపాలునింగని.

ఉ॥ చచ్చినజంతువున్గొనెడి • జాల్ములరీతి వృథాభిమానముల్
గచ్చులెగానిసేయునది • గానఁగరాదిఁక శ్రేష్ఠులెట్లొ? యీ
చచ్చినయట్టి లేయెసఁగఁ•జాలినదీని గ్రహించుటెట్లొ? యీ
వచ్చుటదెట్లు? పుణ్యమెటు•వచ్చుఁ దలంపునృపాలతల్లజా ॥

మంజరి.

ప్రాణముగల్గినయట్టులదీనిని - పసిఁడియావుగాఁ జేసి
మానుగఁగొనువాఁడెసుమి మహాత్ముఁడు - మానవనాయక
యిందఱిలోన ॥

వ॥ అని శపథంబుగాఁబలికిన యాజ్ఞవల్క్యునిఁగని ఋషులందఱుఁ దమలోని
ట్లనుకొనఁదొడఁగిరి.

సీ॥ ఊతనిసామ్మెద్ది • యేగానమ్మకచెల్ల, పానకంబునఁబుల్ల భం

గివచ్చెఁ । బెట్టలేకున్నఁ దాఁ బెట్టుట మాన్పింప • నన్నంబు
లోనీఁగ • యట్లవచ్చె । దినశక్తి లేకున్నఁ • దినసీయకొ
రులఁ దా, నుడిలోనినిప్పుగా • నుఱికవచ్చె । శిష్యుఁడై
ముంగలఁ • జేరిగురునిపైకిఁ, బక్కలోబాకుగాఁ • బరఁగ
వచ్చె ।

సీ॥ నాశ్రితులపాలివిసపువి • త్తైనహింప
వచ్చె నితండునిక నెట్టి • బ్రతుకుగలదు
పరఁగ బంగరుగోవు జీ • వంబులందఁ
జేయనెవ్వానికీయిల • సెక్కమగునో ॥

వ॥ అనుచితుల గుజగుజలాడి యికార్యంబు నీవ్వొనరించి గైకొనఁజాలుదువే
యనిన యాజ్ఞవల్క్యమహాతపఃఖని తనమంత్రాశీర్వచన ప్రభావంబునఁ ద
ద్భర్మమయధేనువు సజీవంబుగావించిన మిథిలాధవుండు సునందాకుమారు
మాహాత్మ్యంబున కద్భుతమొంది మనంబానందవార్ధి నోలలాడ ధనకనక
వస్తువాహనాంబరాభరణ విభూషితుంజేసినసభాస్తారులెల్ల [illegible]
నుతింపఁజాఁగిరి.

(దండకం)

శ్రీభావ రాజీవ భృంగస్వరూపా మరస్తోత్ర సన్మాన్యచారిత్ర భద్రేభ
గాత్ర త్రిమూర్త్యాత్మకా, దివ్యతేజోమయా, మున్ను దైత్యారి రూపుండవై
యుండఁగా నీదువిద్యాసముద్వేద కృత్యంబుగా, నందుశాఖావతంసంబవై,
కోటిచంద్రప్రభాస్ఫూర్తివై, భవ్యసంధాయివై, వెల్గువాక్యల్లకాభిక్, మదిక్
హార్ద మొప్పన్ ప్రతిష్ఠించి, నేనీదుశిష్యుండనై ముందు గైకొందు గాకందునా
భావమెంతేన్ దనన్ దాచిలోకంబునందిప్డ శిష్టత్వమున్వీడి దుష్టాత్ముడై వే
దశాస్త్రంబులన్ దూవనల్ సల్పువిప్రాళికిన్ బోధలన్ దెల్పుసన్మార్గము

ల్బాపి యజ్ఞానఘోరాంధకారంబు నిట్లున్ బటాపంచలున్ జేయు సుజ్ఞాననూ
ర్యుండవై బ్రహ్మరాతిప్రసూతుండవై పుట్టవేయిట్లు శాకల్యునిన్జంపి సభ్రా
ణు నిజ్జైనిస్త్రైవిష్టపంబుల్ నుతింపంగ విద్వద్వరేణ్యుండవై కానుకల్ పొంద
వే, నిన్ను నోడింప నాబ్రహ్మయాజ్ఞుల్, పురాణంబులున్, శాస్త్రమంత్రాదు
లున్, వేదవిద్యల్, శుభకర్మంబులున్, సల్పునీగార్గినిన్గెల్చి సంతుష్టితో భార్య
గాఁగాంచియుద్వాహముజ్జెందవే, నీప్రభావంబు నెన్నంగ నెవ్వారికైనన్ దరం
బౌనె యోగీంద్ర మమ్ముం గటాక్షించి రక్షింపవే సాధురక్షామణీ, దీనచింతామ
ణీ, ధర్మసంస్థాపనాచార్య, సర్వజ్ఞ శ్రీయాజ్ఞవల్క్య నమస్తే నమస్తే నమస్తే॥

వ॥ ఇట్లనన్యసామాన్యంబగు మహిమంబువడసి యాజ్ఞవల్క్యుండు శిష్యసమేతం
బుగాఁదనయాశ్రమంబునకరుదెంచె. తదనంతరంబా మానులు సృష్టిక
ర్తయగు పరమేష్ఠి చెంతకేగి తమపరాభవంబును, సౌనందేయుని శ్రేష్ఠ
త్వంబును నతిదీనాననులై యొక్కమొగిన వచియించిన నమ్మహాత్ముండు,
పరబ్రహ్మస్వరూపుఁడును, దుష్కృత వినాశుండును, సాధుజనావనుఁడు
ను, నగు బ్రహ్మరాతి తనూభవు మహత్త్వ నెఱిఁగియు.

చ॥ మునులయభీష్టముఁ జరుపఁ బూనివిరించనుఁ డొక్కకాంతగా
గ్గనిజనియింపఁ జేసితగు ప్రేరణముల్ బొనరించి యాజ్ఞవ
ల్క్యునినిజపాండితిన్ గెలిచి కోరికఁదీర్పుమటంచుఁ బంప న
వ్వనిత పరాభవంబు గొని వానినుతించె ననేకభంగులన్॥

వ॥ అంతనాయాజ్ఞవల్క్య మహర్షి సత్తముఁడు.

మ. పితృలోకంబు ముదంబుఁ జెందఁగ నుబ్బంధ్వాన్ సౌఖ్యసంపత్తి
ను । న్నతినింగాంచ గృహస్థుఁడన్పదము నందర్ దీనవర్గంబు
స । మ్మతిఁబాలింపనిహంబునంగలుగు సామ్రాజ్యంబునే

లంగను । ధ్రతినై వాహికముంబొనర్చుకొనెఁ గాంతఁగాని నామాంచితఁ.

వ॥ పదంపడి కాత్యాయనీ! మైత్రేయీసహితుండై సర్వలోక పూజనీయుండ గుచుండె.

శ్రీరాగం—ఆది.

హారతిగైకొనుగుణసాంద్ర- యాజ్ఞవల్క్యమునికులచంద్ర॥హా॥

అ॥ అతులితప్రభావ వేదవేద్య- యఖిలలోకయోగిజనవంద్య!
పూ।జితపద్మగర్భయుతభక్తపాలన। శీలాకరుణాలవాల॥హా॥

చ॥ సత్యవచస్కా- యతితతిసంసేవిత•జనకమహారాజవర్యపూజిత సత్యవతీప్రియపుత్రమిత్ర•వైశంపాయన, బ్రహ్మహత్య సంహరకాత్యాయనీమైత్రేయీ సంయుతా•కనకధేను ప్రాణవిధాతా సత్యభాషణ వ్రతవీరభద్రా- చలపతి దాసులొసంగెడిజయ॥ హా॥

సంపూర్ణం.

ఏతత్ఫలం శ్రీయాజ్ఞవల్క్యార్పితమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

---

